# మాతృపూజ

ఆంధ్రరత్నము:
దుగ్గిరాల గోపాలకృష్ణయ్య
గారి జ్ఞాపకార్థము

*

ప్రకాశకులు:
రామ్ జేయ్ అండు కంపెని,
13. తంబుచెట్టి వీథి,
మద్రాసు.

*

మాతృపూజా ధ్యాన తత్పర

మతి పవిత్ర స్నాతుడవు నై

విశ్వమందిర పుణ్య భూమికి

వెడలి రావోయి !

# జన్మభూమి

ఏదేశ మేగినా ఎందుఁగాలిడిన
ఏపీఠ మెక్కినా యెవరెదు రయిన
పొగడరా నీతల్లి భూమి భారతిని
నిలుపరా నీజాతి నిండు గర్వమ్ము

లేదురా యిటువంటి భూదేవి యెందు
లేరురా మనవంటి ధీరు లింకెందు.
ఏ పూర్వపుణ్యమో ఏ యోగబలమొ
జనియించినాడ వీ స్వర్గలోకమున

ఏ మంచిపూవులఁ బ్రేమించినావో !
నిను మోచె నీతల్లి కనకగర్భమున
సూర్యుని వెలుతురు సోకు నందాక
ఓడల జెండాలు ఆడు నందాక

నరుడు ప్రాణాలతో నడచు నందాక
అందాక గల యీ యనంత భూతలిని
మనభూమివంటి కమ్మని భూమి లేదు.
తమతపస్సులు ఋషుల్ ధారఁబోయంగ

# మాతృపూజ

చండవీర్యము శూరచంద్రు లర్పింప
రాగదుగ్ధము భక్త రాజు లీయంగ
భావసూత్రము కవిబాంధవు లల్ల
దిక్కుల కెగఁదన్ను తేజంబు వెలుఁగ

జగముల నూగించు మగతనం బెగయ
రాలుపూవులు సేయు రాగాలు సాగ
సౌందర్య మెగఁబోయు సాహిత్య మొప్ప
వెలిగిన దీ దివ్య విశ్వంబు పుత్ర
దీపించె నీ పుణ్య దేశంబు పుత్ర

అవమాన మేలరా! అనుమాన మేల
భరతపుత్రుఁడ నంచు భక్తితోఁ బలుక!

రాయప్రోలు సుబ్బారావు

# ఆంధ్రమాత

శ్రీ లింపొందగ యావ దాంధ్రజనమాతృక్ష్మాతలీ నూత్నతే
జోలీలామృతమాని, దద్బలవదాత్మైక్యంబునన్ తావకో
ద్వేలప్రాక్తనకీర్తిగీతముల నర్థిం బాడు నీ పుత్రపు
త్రీలోకమ్మున కేమిఁ జెప్పెదవు సందేశంబు నాంధ్రావనీ!

ఆశల్కౌతుకపూర్ణచంద్రికలుపూయన్ దుర్దినాచ్ఛాదమా
కాశమ్మున్ విడిపోవ, నూతనకళోత్కర్షాప్తిమై మాతృపూ
జాశోభల్ దయివారు నీశుభదినోత్సాహంబు నీక్షించి, నీ
యాశీర్వాదము లిమ్ము పుత్రులకు నంబా! యాంధ్రదేవీమణీ!

తేటల్ దేరెడు కాంతిపూరముల నుద్దీపించు ముత్యాల ము
ప్పేటల్ వోలె ద్వదీయకంఠమున శోభింపుల్ నిగారించు, చే
నాటన్ జీవనరోషణల్ గనని కృష్ణాగౌతమీభద్రలన్
గాటంపుం దమిఁ ద్రావువార మిదె కాంక్షాక్షీరమాంధ్రావనీ !

ఆచాళుక్యనృపాలరత్నముల వియ్యమ్మంది, శ్రీకాకుళ
క్ష్మాచక్రేశులలాలనల్ వడసి, కృష్ణప్రాజ్యసామ్రాజ్యపీ
ఠీచంచజ్జయకన్యతో సరసగోష్ఠిన్ బ్రొద్దుపోఁబుచ్చు నీ
పాచీనాభ్యుదయమ్ము నెన్నెదరు గర్వస్ఫూర్తితల్లీ! సుతుల
ద్యన్మోహనమై, కుమారజనగర్వోద్రేకమై, యాత్రిలిం
గోద్యానాప్తమధూదయమ్మగు నవీనోత్సాహపున్ వేళ, —

## మాతృపూజ

విద్యారణ్యయుగంధరాదుల యశోవీర్యమ్ములల్గించు, చీ
విద్యాస్నాతకు లాసఁజేసెదరు, దేవీ! సంప్రసాదింపవే.

జారిన దేశగౌరవముఁ జక్కనదిద్ది, మహాంధ్రమండలీ
భారము శ్లాఘనీయముగఁ బాలనఁజేసి సమాన రాష్ట్రముల్
కూరిమి నాసఁజేయ, తెలుగుం బుడమిన్ గణుసేయరయ్యా, దీ
పారతి నాంధ్రపుత్రులు! జగజ్జనధర్మమె దృష్టినిల్పుచున్.

ఉల్లాసమ్మున మాతృసేవ పయిపై నుద్భూతమౌగంగ నా
పల్లీపక్కణదిగ్దిగంతర స్థలీ పర్యంత వేంగీభువిన్,
జల్లుండాంధ్రమహోద్యమప్రథమపూజాపుష్పముల్ప్రేమపుం
ద్రోళ్ళంగట్టుచు యావదాంధ్రజనసంతానమ్ము నాపైహితుల్.

రణరక్తబంధురారుణమ్మైన క్షితి
కృన కత్తి కడిగిన కదనభూమి
...తాంకురవికాస మయిన యా సుకవి పో
...షిని ప్రశాంతిగనిన చోటు
...రాగి కబ్రపుఁ బెండ్లియైన
...ము వెలిం... తలమ్ము
...క్షే
తా...



# మాతృపూజ

పాడయి శిలావశిష్టమై ప్రాప్తకాల
మనుభవించుచు, నుండియు నక్కటకట
బ్రతికిచెడ్డ యాంధ్రుల పూర్వవైభవంబు
చాటెడిని నాలకింపుడు శాంతమతులు !

కలదాంధ్రోద్యమ వల్లికాకుసుమ రేఖామాలికా కాంతి తుం
దిలశోభాంకురపుంజముల్ భరతమాతృస్ఫీతచూడామణీ!
కలితచ్ఛాయ లనందగింపఁగల భాగ్యంబింక, నీసాంగమం
గళకళ్యాణముఁ బాడఁ బుత్రికలె వేడ్కన్ వత్తురానాటికిన్.
సంతోషింపగదమ్మ! యాంధ్రజననీ! సారస్వతస్నాన వి
శ్రాంతిప్రీతుల, నీదుపుత్రకుల, దీక్షాబద్ధులంజూచి ని
శ్చింతన్ సోదరులార! భూజననిఁ బూజింపుండు బ్రహ్మర్షిణో
దంతవ్యక్తి మనోబలమ్మునదథాస్తంచున్ ఋషుల్ పల్కఁగన్.

రాయప్రోలు సుబ్బారావు.



# స్వచ్ఛంద ప్రయాణము

## దివ్యయువతుల సంభాషణము

సానుమతి

విడివడుటోర్వ్యజాలని నవీనమనః ప్రణయమ్ము లట్లు స్త్రీ
పురుషుల పరస్పరప్రణయమోహానవహానలలందడంగి వి
చ్ఛేదుకమలమ్ము వోలె నదె! చేరువందోచెను నేలఁజూపు మ
పుడమి విశుద్ధులౌ భరతపుత్రులగాంచినతల్లి నెచ్చెలీ!

వాడనిపారిజాతసుమవల్లరులం దగిలించుకొన్న మీ
వాడలనాకవీథికలు వాడినపూవులవోలె శోభలన్
సిషనె, భారతీయపృథివీస్థలినంతయుఁ బ్రాకి నేఁడు తూ
గాఁడు వసంతరోచిరుదయమ్ముల మిన్నులఁబాడఁగోకిలల్?

సెచినాదములందురాగములు పుష్పింపఁగ స్వచ్ఛంద శో
భాచిహ్నంబులు వింతలై నయననిర్వాణమ్ము నందించుచున్
లేచెన్ మంటలవోలె నెల్లెడల; పల్లీపట్టణమ్ముల్ ప్రభా
ధౌచిత్యమ్ముల వెల్వరించెను సపర్యల్ జూడు మాయమ్మత్రీ!

మధునిక

జ్యోత్స్నాపీసేచనమున స్వచ్ఛమ్ములైన
జీవనముల హిమాలయశిఖరసీడఁ

## మాతృపూజ

గడపునా నాగరికులకేర్పడునె యెట్టి
పావనములగు జాతీయబాంధవములు!

ఏనిబిడాటవీస్థలుల, నేగుహాలందు నెఱుంగరాని యే
మానులపర్ణశాలల నిమంత్రితమై యెటడాగియుండెనో
యీనవకావ్యశోభ! పొలియించిన స్వేచ్ఛల కీమ్మవాహినుల్
వీనులకింపుగాగ వినిపింపగ పాటల నెప్డునేర్చెనో?

సానుమతి

భానుడుపుట్టియస్తగిరిపై నిమరించె, సుధాకరుండు మం
దానిలుఁ బాలవెన్నెలలయం దడగించిచనెన్; గభీర గం
గానదిశీతగర్భమున గానమువోలె నడంగియుండె వి
జ్ఞానము లోకమందు, గగనప్రభ లేడనొడాగె మబ్బులన్.

పూయనిపూవులందడగు పుష్పవిడిరీతిని, సందెచీకటుల్
మూయనివేళ శ్యామలనభోమణిశియందలి కానరాని తా
రాయువదీప్తులట్లుల సరస్వతిమిన్నకయుండె, నంతకా
లాయతిచింపుకొంచు కవితార్ద్రిముల్లై చనుదెంచెనీతముల్.

ఆనందమ్మున నైక్యమై యపుడు బృందారణ్యమల్లాడె, వి
జ్ఞానమ్మెల్లెడనల్లువెట్టుటకునై చైతన్యవిద్యాసతుల్
గానమ్ముల్వోదజల్లి, రాఘునికగంగాతీరసంవాసులే
యేనోముల్పచరించియుందురొకో దేవీ! యీశుభప్రాప్తికై.

## మాతృపూజ

క. వీరవ్రతకంకణు లవి
వారలు గీతాకుమారవరు లీశ్వరు లీ
భారతపుత్రరులే, హిమా
దూరము తలఁదాల్పఁదగు వారలు నయవేత్తల్.

చేసినరాజకృత్యములు సింహసకితులులందు నెన్నఁగో
మాసియు నేటికిన్ స్మరణమాత్రన సంగరలక్ష్మికందఱన్
దోసిళులొగ్గఁ జేయు కొలనుల్లు; వా విజయప్రబోధ వి
ద్యామతులున్న వాసములు నల్లవివో! హిమవంతు చేరువల్.

గీ. నర్మదాశుభ్రవీచీకణమ్ములందు
నింపియుండు స్వేచ్ఛాపురంధ్రీమతల్లి
ఋషులనోటఁ బాడిన స్వానాత్మస్తవములు
గాలి నడగిన కోకిలగాన పట్లు.

ఈవిమలప్రదేశమున నొందకుపాడగలేదు లోకలి
లావిదులై ప్రఘోషసరళమ్ముగ పాటల, జన్మభూమికిన్
సేవకులై మఱొందరు రచింపగలే దెవరింపరాని తే
జోవిభవమ్ముచే ప్రజలవొప్పులయుం దనురాగబంధముల్.

అల్లదె! యాంధ్రభూమి! సనుగావకులన్ జయశంఖమెత్తు రా
ట్టల్లజులందుఁ గల్గిన స్వతంత్రులువోయెడునేల; శేముషీ

పల్లవితమ్ములౌ సరళభావములం దొకక్రొత్త రీతిగా
నల్లినసీమ భారతమహామహిమం దలి జీవగీతులన్.

గీ. చదువు లాధారమైన తేజమ్ము లేమి
పౌరుషమ్మాత్మ యైన విద్వత్తు లేమి
సాహితీస్నేహితులగు రాజప్రముఖుల
సంతతి కసాధ్యమనెడు విచారమేల?

మధురిక

వెదురుల వేడియూరుపులు పిట్టలొకర్చుకుహూరవమ్ములున్
గడసి మహానిలమ్మున నొకానొక మేళన మొంది యేకమై
పొదలెడు నస్ఫుటారవము పోలె క్రమమ్ముగ బ్రాకు నీ మహా-
భ్యుదయము లావరించిన విభూతి యనన్యమనోజ్ఞ మంగనా!

సానుమతి

పూచియుపూయకున్న సుమముల్ ముడిగాడ్పులవిచ్చిపోవలె, స్వే-
చ్ఛాచలనమ్ములందు నవశమ్మగు లేతమనమ్ములోడ చె-
ల్లాచెదరైన సాధనములన్ దమకమ్మున చక్కబెట్టుకో
జూచెదరిప్పు పోయిన యశోవిమలాంకము లాసజేయుచున్.

గీ. వెన్నెలలురాలు నడుగుమోపినక్షణాన
నయనముల విషాదములకు నవ్వులొలయు
నామె చనుదెంచె నుదయలక్ష్మి తల్లి
పూలపేటిక కుడిభుజమ్మున దగిల్చి.

అబ్బూరి రామకృష్ణారావు.

# ముఖలింగము

దేవమాతృకలు వర్ధితహేమకేదార
ఖండసస్యము లిందు పండెనేమొ
తెలుగు కళింగ రాజుల గుండెనెత్తురుల్
గడగి రక్తాబ్ధి కదలెనేమొ
శ్రీగంధ కస్తూరి కాగురుద్రవ్యమ్ము
లిట దిగంతముల వాసించెనేమొ
శూరగంగైకొండ చోడుతో నీచోటు
వియ్యాలబిగువులు బిగిసెనేమొ
దక్షవాటీపురీ కవిరాక్షసుండు
ప్రళయవహ్ని శిఖాధూమ పటల మమృత
బిందుశైత్య మొకవాక్కునందు నిచట
బిట్టు మండించి శీతలింపించె నేమొ.

ఈచోట తొలినాడు ప్రాచీసతీముఖాబ్జ
మున నెట్టి కుంకుమబొట్టు దిద్ది
ఈనేలను కళింగ భూనాథశౌర్యాన
ల జ్వాలధూమనైల్యములు గ్రమ్మి

ఈపవిత్రధరిత్రి నోపి త్రైలింగరా
జ్యశ్రీసుధాప్రవర్షంబు గురిసి
కడగి యిచ్చటి మంటిగడ్డలు సైతమ్ము
నవమృగీమదవాసనలు విదిర్చి

వేంగి విషయమేల చాళుక్య విభులతోడ
మనసులో సన్నదమ్ములతనము కలిపి
మును పిఠాపురి, తెల్గురాణించుకొనియె శౌర్య
లీల నృపలీల యీముఖలింగభూమి.

గీ. ఆ దినాల నెంతటి నిశితానురాగ
మభు కళాశిల్పములను విద్యలను చూడ
పగటివేసాలకొరకు తూర్పారబట్టి
ప్రాణములను కళింగ గంగరాజులైరి.

చిఱుత తరంగముల్ కలసి జీబులువారిన వంశధారలో
తరుముకువచ్చె తెల్గుల ప్రతాపశిఖల్ ముఖలింగనాథు క
న్నరిమిన నిప్పుకల్ మిసల నొక్కదినాన, కళింగగాంగు తే
లి రనిన నాళ్లునేటి కనులే పొనుపడ్డవి తెన్గు నిప్పుకల్.

ముఖలింగప్రభురాజు ముద్దునవలాముక్కంటిక్రొన్ని ప్పుకల్
ముఖరీభూతవియత్పథభ్రమరితాంభోవంశధారాపయః

## మాతృపూజ

పక్షశైతల్యముచేత చెమ్మగిలి దీక్షాసంగృహీతవ్రతా
పక్షిరాంశుల్ కుదియించుకొన్న యవికావచ్ఛాదమిథస్స్ఫూర్యచే.

ఇచటి నాగావళీప్రచురవర్షాంభస్త
రంగముల్ వంశధారాజలములు
తరగెత్తిన మహేంద్రతనయాసుపాథస్సు
లోకసాగరగా పొంగి యుఱికిపోయి
గౌతమీకృష్ణవేణీతరంగములు తా
రాధ్యమ్ము నందు నైక్యము భజించి
గుల్లకమ్మజలాల గుబుగుంగుబురులై
పెన్నతరంగముల్ పెరిగిపోయి

తెలుగునదులెల్ల పొంగెత్తి ప్రళయవారి
కెరలిపడి తెల్గునేల ముగించనిమ్ము
నేటితో, నస్వతంత్రతా నియతమైన
యీబ్రతుకు తెల్గువారు భరింపలేరు.

విశ్వనాథసత్యనారాయణ.



# కొండవీటిపొగమబ్బులు

దగ్ధాంధ్రరాజ్యనిత్యవిఘాత ధూమమ్ము
వలెఁ గొండబురుజుల కెలన లేచి
బురుజుకొమ్ముల వీడి పోలేని రెడ్డి కీ
ర్తివోలెఁ బెనురాళ్ల నతుకులుపడి
రెడ్డకండావెన్క రేఁగు వంటింటి పె
న్బొగవోలె గుమురులై ముందుసాగి
ద్రాగ్ధావదాంధ్రస్వతంత్రతారమవోలెఁ
గొండ లంటీయంటకుండఁ బోయి

శ్యామలీభవద్గ్రాసఘాసాదనార్థ
మొలయు వెల్లావుల కదంబములుగ నిలిచి
కొండకొమ్ములులో దాఁచుకొన్న క్రొత్త
క్రొత్తపొగమబ్బు లలమె నీకొండకొసల.

ఒకరెడ్డి సభతీర్చియున్నకొండకు వాలు
కొసలతో ముత్యాల గొడుగుపట్టు
ఒకరెడ్డిమూర్తి పోలికతీరియున్న కొం
డకు కోసగా కిరీటమ్ము పెట్టు

## మాతృపూజ

ఒక్కయంతఃపురవధూత్ప్రేక్షఁజను బురు
జున సన్నమేలిముసుంగు తొడుగు
ఒక తెల్గుబంటు శీవికి ముద్రఁగొనియున్న
బురుజుపజ్జ మహాసివోలె వ్రేలు
ఈజగా పొగమబ్బులు రాజసేన
మఱచిపోలేవు రసధునీమహితమూర్తి
లేము లెక్కించుచుంటిమి యెన్నినాళ్లు
చనెనో అనివందలేళ్లుగా చాఁచుకొంచు.

అస్మదగ్ధ్రాతిథేయారబ్ధములు రెడ్ల
భువి వంటశాలల పొగ లటంచు
అచట శ్రీనాథకావ్యశ్రోతలగు మాకు
పఱచిన పందిళ్లపఱపు లంచు
కొండకొమ్ముల తీర్చికొని నిల్చియున్న యాం
ధ్ర భటాళిక్షీరగంధా లటంచు
ఉత్సవాగతజన మెక్కిఁగి పోఁ గొండకొ
మ్ములఁదొంగి కనురెడ్లముగుద లనుచు
మున్ను గుఱ్ఱాల దూకించుకొన్నచోట్ల
నడుగడుగునందు పాతంబులైన మాకు

మాతృపూజ

నప్పుడప్పుడు తలలెత్తి నంత కొండ
కొసలమబ్బులు పొరపెట్టి విసరులాడు.
ఒకసారి వలిపమ్ము చికిలిముత్యాల యం
చుల వోలిక నుపత్యకల చరించు
ఒకసారి జఘనభాగోపరిస్రస్త చే
ల విధాన గిరిమొదళ్లం బడిపోవు
ఒకసారి గిరిలక్ష్మి మొకముపై మొగలి పు
ప్పొళ్లూఁదుకొన్నట్లు చెల్లరేఁగు
ఒకసారి స్వేదబిందుకములు రత్యంత
వేళాకుచావృత్తి విస్తరించు

చిఱుత పొగమబ్బు లీకొండసీమ పలుచఁ
బడి, విశీర్ణమై, ధూతమై, తడిసి, రాచ
సిరి యుడిగిపోయినట్టి యీ శిథిల దుర్గ
లక్ష్మి కొనఁగూర్చు వెట్టి యలంకృతులను.

అధిరూఢకుం డినేశాత్మజ మఖుస స్యం-
దన గరుత్మన్మండ తధ్వజమ్ము
గజపతి ప్రౌఢోగ్ర కరిఘటా శుండా వి
ధూతాంబు నిచయబిందూత్కరంబు

## మాతృపూజ

రెడ్లకీర్తిపతాక శ్రీనాథకవికావ్య
దూతహంసాధినాథుని గరుత్తు
అలకసవాపాత్రు నంటి రాజనకృష్ణ
రాయ బాహాగ్రజాగ్రన్మహాగ్ని
ఒకటొకటి గాఁగ స్మృతి కెచ్చుచున్న వన్ని
చిఱుత లీ పొగమబ్బులు చిందులాడి
కొండవీటి ప్రాఁగోటపై కొమ్ములందు
నవ్యవక్షేందిరా ధురంధరనిరూఢి.

నిప్పులు చూడ మన్ని లుత్కలప్రౌఢ
పాత్రులు బురుజుల పైన లేరు
ఈటెలఁగ్రుమ్మ శౌర్యేందిరా పుంమూర్తు
లైన రెడ్డికోటపైన లేరు
గుండెలకత్తులఁ గ్రుమ్మ రాయల రాచ
యేనికగున్న లీపైన లేరు
అడుగడ్డునకుఁ బ్రాణ మాహుతి గొనఁగ ద్వాః
స్థాన రక్షక భటులైన లేరు
ఓసి పొగమబ్బులార! రండోసి రండు
మీకు మాకిష్ట మే యిష్టమాక లేక

౧

## మాతృపూజ

రుగవచ్చు రాజులు కొల్వు తీర్చుచోట
రుగవచ్చు రాకన్నెలున్నట్టిచోట.

ంత నిర్భయముగా నీపొగమబ్బులు
జెట్టీల బురుజుపై చిమ్మిరేఁగు
లెక్క లేనట్టి యీ పొగమబ్బులు
మిరియాల తఖతుపై తటిమిపోవు
ంతయడ్డంకి లేకీ పొగమబ్బులు
తారాబురుజుమీఁద దాఁట్లువెట్టు
ఈమాత్ర మాఁకలేక పొగమబ్బులు
కేళిశుద్ధాంత సౌధాళిఁ జొచ్చు
చ్చిపొగమబ్బులార! కోపించిరేని
రెడ్డవారుసుమీ! మిమ్ము చించివొమ్ము
ాఁచిచెండాడిపోదు రడ్డంకిరెడ్లు
ని హానమ్ము లడ్డంకి లేనిరెడ్లు.

డుపుల విలిఖించిరేమొ నా ముక్తాక్షు
రములుగా దుర్గకుడ్యముల నెలసి
చట ముఁగ్గులు పెట్టిరేమొ నాక్లుప్త ము
క్తారేఖగా గిరిస్థలము మెఱసి

ఇట వితాన మమర్చిరేమొ నామృదు మరు
చ్చలితమధ్యమై చదలఁ దీఁచ
ఇటకేళకుళివెట్టిరేమొ నా తుదల శీ
తలపృషత్పరిషించితములఁ గదలి
ప్రాతరనతిక్రమితయామ భానురోచి
రాసమాత్తధావళ్య మర్యాదమైన
లేఁత యీపొగమబ్బు పురాతనంబు
త్రవ్వుచున్నది రెడ్ల యాంధ్రప్రశస్తి.

ఇవి రెడ్డిరాజుల యెదలలో పూరించు
కోరాని కోర్కెలు గుములుకట్టి
ఇవి తెల్గుబంటుల యుడుపగింజలై
నాత్మలు పీడ లే కరుగుదెంచి
ఇవియు శ్రీనాథుని యెఱ్ఱప్రగ్గడకావ్య
తకు రానిభావముల్ తరకగట్టి
అవచి తిప్పయసెట్టి వివిరత్నరాశిగా
మలఁచిన ప్రాణముల్ మగిడివచ్చి

కొండవీటి పొలాల్ విడికోను లేక
ఆశబలమున మగుడు ప్రేతాత్మల వలె

# మాతృపూజ

సొరిది నీగిరికొమ్ముల చుట్టుపట్ల
నిట్టిపొగమబ్బులై భ్రమియించు గాక.

నాప్రాణములకును నీపొగమబ్బుల
　　కేమి సంబంధమో యేను గూడ
పొగమబ్బునై కొండ చిగురుకోసల మైన
　　బురుజులపైన కొమ్ములకు పైన
వ్రాలిపోనో మధ్య వ్రీలిపోనో నేల
　　రాలిపోనో గాలి తేలిపోనో
నాయూహ చక్రసుందరపరిభ్రమణమై
　　యీ పొగమబ్బుల నేవరించె
ఎన్నిపొగమబ్బులెఱిఁగితే నేను మున్ను
తూర్పుకనుమలు విడుచు నిట్టూర్పులట్టి
విచటి యీ పొగమబ్బులే యెడదలోని
లలితము మదీయగీతి నేలా వెలార్చు!

విశ్వనాథ సత్యనారాయణ.



# నైవేద్యము

తల్లి, నీయుత్సవముఁ గాంచఁ దరలినార
లనుఁగుఁ దనయులు నైవేద్య హస్తులగుచు;
ధన్యులెల్లరు నాత్మోచిత్తంపుఁ గాన్క-
లర్పణము సేయవచ్చిరి; యందికొమ్మ.
స్వర్ణసుమముల నర్చన సలుపువారు
భాగ్యవంతులు నీపాద పద్మములకు;
ఏమి లేనట్టి భిక్షుకుండేని నేఁడు
కంటిఁ గ్రొన్నీటి ముత్యాల కాన్క లిడును.
పూజ్యు లధములు, ధనికులు పుట్టుబీద
లనెడి యెడలేక యెత్తిరి హారతులను;
భక్తిపరవశులైన యా ప్రజలగీతి
దిక్కుదిక్కులయందుఁ బ్రతిధ్వనించు.
అమ్మరో! నీదు మందిర ప్రాంగణమున
మండుచున్నది కర్పూర ఖండగణము,
త్యాగపరిశుద్ధ మగు నాత్మఁ దలఁగిపోవు
కామమటు ధూమరేఖలు గడలుకొనఁగ.
ప్రొద్దుపొడుపున నీ పాదపూజ కొఱకు,
కవిని, తెచ్చితి దోసిటఁ గన్నెపూలు;
బలివితర్దికనిరతంబు వెలుగునటుల
హృదయపు సుగంధదీప మర్పింతుఁ గొనుము

దువ్వూరి రామిరెడ్డి.



# సేవ

మముఁగన్న భారతమాత మందిరమున
దివ్వెలై మన ముందామా, పైడి
దివ్వెలై మన ముందామా.

పరమపావనితల్లి పాదపూజల వాడు
పువ్వులై మన ముందామా, పొన్న
పువ్వులై మన ముందామా.

భారతీదేవి విపంచిక రవళించు
తంత్రులై మన ముందామా, దివ్య
తంత్రులై మన ముందామా.

జన్మభూమీశౌర్య సౌభాగ్యములు చెల్లు
గీతలై మన ముందామా, భావ
గీతలై మన ముందామా.

కదన వీరులచేతి ఖడ్గధారలలోని
మెఱుపులై మన ముందామా, కాఱు
మెఱుపులై మన ముందామా.

దువ్వూరి రామిరెడ్డి.



# పద్మనాభము

తెనుగు వీరుల విమలకీర్తిప్రభావ
మతుల విజయప్రతాప శౌర్యప్రశస్తి
పోయెనకట! నిర్మూలమై పోయె నిచట
లంచగొండుల కుటిల కల్పనము వలన
మాతృదేశ విద్రోహుల మాయవలన.

నిన్నరీతుప్రతాప సందీప్తి శాలి
పూసపాటి విజయరామ భూపమౌళి
తొలగి చనెనట సూర్యమండలము దాటి
విపుల సామంత గణపరి వేష్టితుడయి.

వరదలై భూతముల మెడబంటిగాగ
శూరజన కంఠ నిర్గత శోణితమ్ము
పారె నీ పూతధాత్రి నిబ్బరము తొలగి
స్వర్గవాసులు రెప్పవాల్పకయె కాంచ.

అట్టి భారతస్వాతంత్ర్య హరణమోగ
వాసరము లోట నాంధ్రసర్వ స్వతంత్ర

# మాతృపూజ

రాజ్యలక్ష్మి పాశ్చాత్యుల ప్రాపుచేరె
నిచట; దైవయోగమునకు నెదురు కలదె!

ఆ నితాంత కఠోర దృశ్యావలోక
నమున సహజార్ద్రిమృదుల మానసము చెదర
కంటనీర్వెట్టి నిలువక కరగి పారు
నేటికిని సైత మీ గోస్తనీస్రవంతి.

భయద దాస్యవిశృంఖలా బంధితుడవు
ఓయి! జీవచ్ఛవాంధ్రుడా! ఒక్కమారు
బలుకనిమ్మీట నింత కవోష్ణబాష్ప
మలినధార స్వాతంత్ర్య సంప్రాప్తి కొరకు.

పురిపండా అప్పలస్వామి.



# దేశభక్తులు

చిరపరాధీన శృంఖలాంచ్ఛేదమునకు
జీవితసుమాలె ధారవోసితిరి మీరు
కురియదే నేడు స్వర్గీయ కుసుమవృష్టి
శ్రీవిరాజిల్లు మీయోధ శిరము లందు.

బాధలే భాగ్యముగ నోడిబట్టజాలు
భారతాశ్రమ తరుణ తాపసులు మీరు
ఏ నిరంకుశులేని బంధింప నింపు
నిగళముల త్రెంచుకొనెడు సైనికులు మీరు.

స్వార్థలవమేనిలేని మీ త్యాగ గరిమ
ప్రాకిపోయెను ఖండాంతరాల దాటి
ఇది స్వరాజ్య రమానవాభ్యుదయ వేళ
నభమె నినదించె విజయదుందుభుల మ్రోత.

పురిపండా అప్పలస్వామి.



# ఉయ్యాలా! దంబాలా!

ఉయ్యాలా! దంబాలా! భారత నవజీవన బాలా!
పూరిత సత్యాగ్రహశీలా! పరిభవ దుఃఖిత పాంచాలా!
నీపురుడు - ఏ నెలలో - వెన్నెలల - క్రొన్నెలలో
నీపుట్టు - వెచ్చోట - మిన్నేట - మున్నేట —   ఉయ్యాలా...
తొలినాటి - వేదాలు - పులివోని - చనుబాలు
మలినాటి - కావ్యాలు - కమ్మగు - జనగూళ్ళు   ఉ...
శ్రీరామాయణకథలు - ఊకొన్న వాక్సుథలు
భారతగీతారుతము - చందాయి యమృతము?   ఉ...
బుద్ధుడు నీసంబుద్ధి - యవనులోకో నీకుద్ది
మొగల్ మరాటుల్ చేబంతుల్ - రసపుత్రుల్ చేమంతుల్   ఉ...
పాశ్చాత్యమ్ మోహాంధమ్ - ప్రాచీనమ్ ప్రియబంధమ్
ఆధ్యాత్మమ్ కళ్యాణమ్ - స్వాతంత్ర్యమ్ శతమానమ్   ఉ...
నీ మొట్టు నీలాలు - నీచుట్టు నీరాలు
జపదొట్టు తలంబ్రాలు - ఒడిగట్టు మగరాలు   ఉ...
ముజ్జగపు దీవెనలు - ముప్పదికోటుల జనులు
జయజయవాద్యోన్నతులు - జేజేల హారతులు   ఉ...

కవికొండల వేంకటరావు.



# జాతీయ గీతిక

హిమగిరి శిఖరము - వింధ్యపసీంద్రము
కన్యాకుమారీ పదడిండీరము
స్ఫురితము - భరితము - చలితోల్లలితము
స్వాతంత్ర్యముచే - స్వాతంత్ర్యముచే
స్వాగతమనవోయ్, కని, పనివినవోయ్,
మనవోయ్, అనవోయ్, జయ్, జయ్, జయ్!

జాహ్నవి, గౌతమి, కృష్ణ, పినాకిని,
కావేరి, నర్మద యమునా సింధులు
అహర్నిశాదులు - ఒకటేగానము
కలలో - అలలో - అవే ప్రయాణము
స్వాతంత్ర్యముకై - స్వాతంత్ర్యముకై
స్వాగతమనవోయ్, కని, పనివినవోయ్
మనవోయ్, అనవోయ్, జయ్, జయ్, జయ్.

గుజరాత్, వంగ, అంగ, మరాఠా,
త్రిలింగ, తమ్మిళ, కళింగమును జను
లజరులు - అమరులు - అనామయులుగా
స్వాతంత్ర్యముహేయ్! స్వాతంత్ర్యముహేయ్!

# మాతృపూజ

స్వాగతమనవోయ్, కని, పనివినవోయ్,
మనవోయ్, అనవోయ్, జయ్, జయ్, జయ్!

నౌరోజ్ తిలకులు, లజపద్దాసులు
దాని పథంబున, నలిగిన నాగిలిన
వెచ్చనినెత్తుటి దివిటీ వెలుగున
స్వాతంత్ర్యంబదె! - స్వాతంత్ర్యంబదె!
స్వాగతమనవోయ్, కని, పనివినవోయ్
మనవోయ్, అనవోయ్, జయ్, జయ్, జయ్;

ఇంగ్లండమెరిక, స్వీడన్, స్విట్జు,
జపాను, జర్మని, కీచు, పరాసు,
అంబ విశ్వకళ కభివాదన మిడు
స్వాతంత్ర్యమురా, స్వాతంత్ర్యమురా
స్వాగతమనవోయ్, కని, పనివినవోయ్,
మనవోయ్, అనవోయ్, జయ్, జయ్, జయ్!

కవికొండల వేంకటరావు.

# నా జన్మభూమి

౧

నా జన్మభూమేదిరా
బాపుజీ!
నాముద్దు తోటేదిరా?
నాకోకిలమ్మేది, నాపూలమేడేది,
నారాచిలుకేది, నావలపుపాటేది.
కలలోని సిరులాయెరా
బాపుజీ
కారడవిపాలైతిరా!

౨

నాయేటి లంకేదిరా
బాపుజీ!
నాయాలమందేదిరా!
నామేని పొంగేది, నామనసు పరుగేది
నాగస్వరమ్మేది, నాయేలపాటేది?
కాలమిట్లైపోయెరా
బాపుజీ
కన్నీరె యేరాయెరా!

# మాతృపూజ

ఏనాటి కథలాయెరా?

బాపుజీ!

ఈజీవ మెటునిల్చెరా?

నాప్రేమ గెలిచేనా? నాతోట పూసేనా?

నావీణ ప్రోగేనా? నాపాటే పాడేనా?

నాపాలి ప్రభు వేడిరా?

బాపుజీ!

నాకృష్ణు డేమాయెరా?

తురగా వేంకటరామయ్య.



# దొరవు నీ వయ్యేదవురా!

పరమశివుడే తండ్రిరా! ఈ
ప్రకృతిసుందరి తల్లిరా!
పాడియావులు పంటపొలములు
భాగ్యములు రాజ్యములురా!

గున్నరా ఈ భరతభూమిని
తొలుకరించిన పుణ్యభూమిని
కరువులేని స్వర్గరాజ్యపు
దొరవు నీ వయ్యేదవురా!

కాలమే తలక్రిందుగానీ
కాలయముడే యేలుకోనీ
నీవు నీగోవులును శాశ్వత
జీవులై యుండేరు గదరా! దు...

పాడు నేలే లేదురా! నీ
భావమే బీడాయెరా!
పరిమళించే తోట పెంచీ
పరమశివు నాడింపరా! దు...

౧

## మాతృపూజ

గాలివెలుగులు జూడరా! మే
ఘాల వర్షము నడుగరా!
సూర్యచంద్రుల గమన లీలా
శోభలను దిలకింపరా! దు...

ఏటి లంకల మేతమేసీ
పూతగిల్లిన జోడు గిత్తల
పైడి నాగటి కర్రులో జీ
వాల జీవిత ముండెనోరా! దు...

పైరులను గాచేటి సుందరి
ప్రకృతితో వెలిగేనురా! ఆ
మేడలో వర్తించు రాణికే
కూడుగుడ్డలు దూర మగురా! దు...

ఆలుమగలూ జోడు గూడీ
ఆడుకొంటూ పాడుకొంటూ
జీవకాంతుల వెలుగు సస్య
శ్రీలలో విహరించె దరురా! దు...

## మాతృపూజ

శుభద మగు 'రాట్నంపు' శ్రుతితో
సుందరీమణి పాడుచుంటే
పొంగుతూ ఆడేటి బిడ్డలే
భూము లన్ని యేలెదరురా!                    దు...

కత్తికలములు వ్రాలెరా! నీ
కష్టమే గెలిచేనురా!
ప్రకృతిపురుషుల ప్రతినిధులు మీ
ప్రభుత యే నిత్యమ్మురా!
దున్నరా ఈ భరతభూమిని
తొలకరించిన పుణ్యభూమిని
కరువులేని స్వర్గరాజ్యపు
దొరవు నీవయ్యె దవురా!

తురగా వేంకటరామయ్య.



# మా గాంధి

కొల్లాయి గట్టితేనేమి ?
మా గాంధి,
కోమట్లై పుట్టితే నేమి ?
వెన్నపూసా మనసు
కన్నతల్లీ ప్రేమ
పండంటి మోముపై బ్రహ్మతేజస్సు ! కొ.

నాల్గు పరకల పిలక
నాట్యమాడే పిలక,
నాలుగూ వేదాల నాణ్యమెరిగిన పిలక ! కొ.

బోసి నో ర్విప్పితే
ముత్యాల తొలకరే,
చిరునవ్వు నవ్వితే వరహాల వర్షమే ! కొ.
కౌశికుడు క్షత్రియుడు
కాలేద బ్రహ్మఋషి
నేడు కోమటిబిడ్డకూడ బ్రహ్మఋషాయె కొ.

కొల్లాయి గట్టితే నేమి ?
మా గాంధి,
కోమట్లై పుట్టితే నేమి ?

బసవరాజు వేంకటప్పారావు.



# దుందుభి ధ్వానము

చాటవే! — దుందుభి! — చాటవే! —

౧

చేదుపుష్పఁ బంచదారకుఁ
జేరఁదీసి గ్రహించు నార్యుల
వాదములలో భేదభావము
లేదు లేనేలేదు లేదని— చాటవే—

౨

దారుణక్రియ లెన్ని చూపిన
నోరు పనియెడి మూలమంత్రము
గోరు ముద్దలఁతోడ నేర్చిన
భారతీయులు భయము పడరని— చాటవే—

౩

నల్లమడుగులు నింపఁ గురిసెడి
బొల్లిమబ్బుల దుల్లఁగొట్టెడి
చల్లగాడ్పులు భరతభూముల
నెల్లదిక్కుల నల్లుకొనెనని— చాటవే—

౪

ప్రేమసింధు-తరంగములలో
సామగానము వెడలె భారత

౧

## మాతృపూజ

భూమిలోఁ గలవార లందఱు
సోమయాజుల వారలైరని— చాటవే—

౨

నిప్పుఁగొండలనుండి పన్ని
రుప్పతిల్లఁగఁ జేయు మంత్రము
తప్పకుండఁగ నెల్ల హైందవు
లొప్పఁజెప్పఁగ రండురండని— చాటవే—

౩

చల్లచల్లఁగ జాతి దుర్మతి
తెల్లమొగమై పోవుచుండెను
మెల్లమెల్లఁగ మేలుకొండో
తెల్లవాఁడిన దంచు నెల్లెడ— చాటవే—

వేంకట పార్వతీశ్వరకవులు.

# ప్రథమ పాదానుక్రమణిక.



---

# కవితా సమితి గ్రంథావళి

౧ ప్రభవ

ఖండకావ్యము

౦-౮-౦

శ్రీ - శ్రీనివాసరావు.

౨ నందకుమారవధ

చైతుసింగు చరిత్ర

౦-౮-౦

మొసలికంటి సంజీవరావు.

3 ఉత్కళ పతనము

నాటకము

పురిపండా అప్పలస్వామి.

౧ వార్షిక సంచిక

౧-౦-౦

౨ వైశాఖి

౧-౦-౦.

కవితా సమితి,

విశాఖపట్టణము.